ప్రవిశ్య పరిగృహితాతిథ్యే కౌశికే నిజాగమనకారణ
మావేదయతి జనకేన ప్రదర్శితం శివశరాసనం దశరథా
త్మజో బభంజ. ౧౮. ప. జాతానందస్తు జనకో దూతై స్త్వ
రితగామిభిః, ఆహ్వాపయద్దశరథం సకుటుంబపురోధసమ్.
౧౯. ప. అథోత్తమే ముహూర్తే స రామాయ ధరిణీ
సుతామ్, సీతామదాదాత్మసుతామూర్మిళాం లక్ష్మణాయ
చ. ౨౦. గ. అథ నిజానుజస్య కుశధ్వజస్య తనుజే
మాండవీశ్రుతకీర్తీ భరతశత్రుఘ్నాభ్యాం చ దత్వా శుభే
ఽహని వివాహమకరోత్. ౨౧. ప. అథానురూపజాయాభి
రుపేతై స్తనయైస్సమం, ప్రతస్థే కోసలపతిస్సాకేతనగరం

---

మిత్రుడు మిథిలను జేరి జనకునిచే పూజలంది తనరాకకు కారణమును
జెప్పెను. అంతట జనకుడు [illegible] శివధనుస్సును రాముడు
విరిచెను. ౧౮. జనకు డెంతయు సంతసించి కుటుంబమును,
పురోహితుని తోడుచేసికొనిన దశరథుని శీఘ్రగాములగు దూతలచే
పిలిపించెను. ౧౯. అంత శుభదినమునందలి మంచి ముహూర్తమున
భూపుత్రిని రామునకును, తన కొమరితయగు నూర్మిళను లక్ష్మణున
కును, తన తమ్ముడగు కుశధ్వజుని కొమరితలగు మాండవీశ్రుతకీర్తులను
భరతశత్రుఘ్నులకు నిచ్చి వివాహము చేసెను. ౨౧. అంత తమకు
తగిన భార్యలతోఁ గూడిన కుమారులతోఁ గూ[illegible] దశరథుడు సాకేత

నిజమ్. ౨౨. ప. జిగీషయాఽఽగతం రామం భార్గవం రఘువంశజః, రామో జిగాయ జయినమాలిలింగ నృపస్సుతమ్. ౨౩. ప. అథ ప్రవిశ్య నగరం సాకేతం రఘునందనః, సీతయా రమమాణస్సన్ సమ్మోదం సమవిందత. ౨౪.

ఇతి బాలకాణ్డః.

# అయోధ్యాకాణ్డః

ప. తతో భరతశత్రుఘ్నౌ తాతాదేశేన జగ్మతుః, యుధాజిదభిధానస్య మాతులస్య పురం ప్రతి. ౧. ప. రామా

---

నగరమునకు బయలు వెడలెను. ౨౨. దశరథరాముడు తన్ను జయింపవలెనను కోరికచే వచ్చిన జమదగ్నిపుత్రుడగు పరశురాముని జయించెను. దశరథుడంత జయమునొందిన తనపుత్రుని కౌగిలించుకొనెను. తరువాత సాకేతపట్టణముచేరిన శ్రీరాముడు సీతతో క్రీడించుచు సంతోషము నొందెను. ౨౪.

## అ యో ధ్యా కాం డ ము

ఇటులా సీతారాములు సుఖముండగా కొంతకాలమునకు తమ తండ్రి పనుపున భరతశత్రుఘ్నులు యుధాజిత్తను తమ మేనమామయొక్క యూరికి వెడలిరి. ౧. శ్రీరామునకు

భిషేచనం కర్తుం యతమానం మహీపతిమ్, మంథరాకులిత స్వాంతా కైకేయీ దుర్వచోఽబ్రవీత్. ౨.గ. యది త్వం సత్యసంగరోఽసి శమ్బరసంగరసముదీరితవరయుగళే ప్రథమస్య ఫలం రామస్య వనవాసం ద్వితీయస్య భరతాభిషేచనం చ విధేహి. ౩. గ. నైవం యది విషముపభుజ్య పశ్యత స్తవ ప్రాణాం స్త్యజామీతి. ౪. ప. ఇదం పరుష మాకర్ణ్య మూర్ఛితో నృపతి ర్భువి, పపాత వజ్ర నిర్భిన్నపక్షః పర్వతరాడివ. ౫. ప. అసత్యభీతో నృపతి శ్చిరేణ ప్రాప్య చేతనామ్, కైకేయీం ప్రార్థయామాస రామస్య పురవ

---

పట్టాభిషేకము చేయబూనిన దశరథునిగూర్చి మంథర యనుదాసిచే కలవరపెట్టబడిన మనసు గల కైకేయి యిట్లు పలికెను. ౨. ఓ రాజా! నీవు సత్యసంధుడవేని శంబరయుద్ధమునం దీబడిన రెండు వరములయందును మొదటిదానికి రామవనవాసమును రెండవదానికి భరత పట్టాభిషేకమును ఫలములుగా నేర్పాటు చేయుము. ౩. ఇటుల చేయవేని విషమును భక్షించి నీయెదుట నీవు చూచుచుండగనే అసువుల బాసెదను. ౪. ఈ కఠినమైనమాట విన్నంతనే ఇంద్రుని వజ్రాయుధముచే తెగగొట్టబడిన ఱెక్కలుగల పర్వతరాజువలె మూర్ఛిల్లి నేలపైబడెను. ౫. అబద్ధ మనిన భయపడు దశరథుడు చాలసేపటికి తెలివినొంది "రాముడు పట్టణమున నుండుట కొప్పు

ర్తనమ్. ౬. ప. బహుధా ప్రార్థ్యమానాపి సా ముమోచ నచాగ్రహం, నిమమజ్జ మహీజానిరపారే శోకసాగరే. ౭. ప. వనం గచ్ఛామి తాతేతి ప్రణమ్యాపృచ్ఛ్య రాఘవః, సాకం సౌమిత్రిసీతాభ్యాం సమారురుహే రథం రథీ. ౮. ప. సర్వాననుగతాన్ పౌరాన్వఞ్చయిత్వా వినిద్రితాన్, శాద్వలేన పథా రాత్ర్యాం స జగామ సురాపగామ్. ౯. గ. తత్ర నివసతా గుహాభిధేన వ్యాధేన సుహృదా సముత్తీర్య సురతరఙ్గిణీమవాప్య చిత్రకూటగిరి మనుజవిరచిత వరివస్యః సహ సీతయా చిర మరమత రఘువరః. ౧౦.

---

కొనుము" అని ప్రార్థించెను. ౬. పలువిధముల వేడుకొనబడిన దయినను కైకేయి కోపమును విడువలేదు. అంత రాజు అంతులేని దుఃఖసముద్రమున మునిగెను. ౭. అట్టితరి రాముడు "ఓ తండ్రీ! అడవికి పోవుచున్నాను" అని నమస్కరించి సీతాలక్ష్మణులతో గూడ రథమునెక్కెను. తనను వెంటాడిన ప్రజలను రాత్రి నిదురించుచున్నవారై యుండ మోసముచేసి పచ్చిక గల మార్గమున గంగానది చేరెను. అట నివసించుచుండెడి మంచిమనసుగల గుహుడను బోయవానిచే గంగను దాటింపబడి చిత్రకూటపర్వతమును చేరి లక్ష్మణుడు సకలోపచారములు చేయుచుండ సీతతోకూడ చాలకాలము క్రీడించెను. ౧౦. అటు తరువాత భరింపరాని

౯. తతః. ౧౧. ప. మహాత్మా పుత్రశోకేన దివం దశరథో యయౌ, దూతైర్భరత మానిన్యు రమాత్యా ఆశుగామిభిః. ౧౨. ౯. సచ సమాకర్ణ్య సకలాం ప్రవృత్తిం నిపత్య సంజ్ఞావిరహితస్సర్వంసహాయామవాప్య చిరాయ చేతనాం విరమ్య వసిష్ఠాదినిరోధేన కైకేయీమన్థరామారణాద్వ్యాధాయార్ధ్వదైహికం దశరథాయ ప్రస్థాయ నిఖిలపౌరైస్సమముపేత్య చిత్రకూటాచల మవనిజాజానేశ్చరణారుణాంబుజయుగళే నిపపాత. ౧౩. ప. మృత మాకర్ణ్య పితరం శుచా దత్వా జలాఞ్జలిమ్, పప్రచ్ఛ భరతం భద్రం పౌరాణాం పరమః పుమాన్. ౧౪. ప. తత స్సపాద

---

పుత్రశోకముచే దశరథుడు దివికేగెను. అంత మంత్రులు శీఘ్రగాములగు సేవకులచే భరతుని రప్పించిరి. ౧౧, ౧౨. భరతు డిచటిసంగతినంతయు విని చేష్ట లుడిగి నేలపైబడి కొంతసేపటికి తెలివొంది వసిష్ఠాదు లడ్డగించుటచే కైకేయీ మంథరల చంపుటమాని దశరథున కపరకర్మల నాచరించి ప్రజలందఱితో గూడి చిత్రకూటముచేరి రాముని పాదపద్మములపై బడెను. ౧౩. పరమపురుషుడగు రాముడు తండ్రిమరణమును విని దుఃఖముతో గూడినవాడై తిలోదకముల నొసగి "పౌరులందఱు సుఖ మున్నారా?" యని భరతు నడిగెను. ౧౪. అనంతరము భరతు డాతని పాద

పతనం భరతేనార్థితోఽపి సః, న జగామ పురం రామ
స్తాతాదేశ మనుస్మరన్. ౧౫. ౪. అనంతర మగ్రజాదేశే
నాయోధ్యా ముపేత్య భరతో నందిగ్రామే రఘునన్దన
వజ్జటావల్కలధారీ సన్ సింహాసనప్రతిష్ఠాపితాభ్యాం
రామపాదుకాభ్యాం రాజ్యకార్యాణి విజ్ఞాపయన్ రామా
గమనదివసాన్ గణయన్నువాస. ౧౬. ౫. రఘువంశ
పయోరాశి శీతాంశు రథ రాఘవః, ఆశ్రమాదాశ్రమం
గచ్ఛన్ప్రావిశ ద్దణ్డకావనమ్. ౧౭.

ఇత్యయోధ్యాకాణ్డః.

---

ములపైబడి యెంతవేడినను తండ్రిగారి యాజ్ఞను తలచికొని పట్టణమునకు వెడలనివా డాయెను. ౧౫. అంతట అన్నగారి యాజ్ఞచే భరతు డయోధ్యచేరి నందిగ్రామమున రామునివలె జడలుదాల్చి సింహాసనమం దుంచిన రామపాదుకలకు రాజ్యకార్యముల విన్నవించుచు రాముని పునరాగమనమున కున్న దినముల లెక్కించుచుండెను. ౧౬. రఘువంశమను సముద్రమున నుద్భవించిన చంద్రుని వంటి రాముడు ఆశ్రమమునుండి ఆశ్రమమునకు తిరుగుచు కడకు దండకారణ్యము చేరెను.

# అరణ్యకాణ్డః

ప. విరాధ మసురం హత్వా విపినే దణ్డకాం విశన్,
శరభఙ్గమునిం రామో నత్వాగస్త్యముపాగమత్. ౧.
ప. తద్దత్తానీన్ద్రచాపాదీన్యాదాయ సహసీతయా, పంచ
వట్యాం చిరం రామో రామానుజకృతోటజే. ౨. గ. తత్ర
కదాచన హేమంతసమయే రావణానుజా శూర్పణఖా
భిధా యాతుధానీ సౌందర్యసలిలశరధిం దాశరథిం
నిరీక్ష్య 'భర్తా మమ భవాన్ భవ'త్వితి నిర్బబంధ. ౩. ప.
పరిగ్రహీతు మాత్మానం దాశరథ్యో రనిచ్ఛతోః, సీతా

---

## అ ర ణ్య కా ం డ ము

విరాధుడను రాక్షసుని జంపి దండకారణ్యమును జేరి
శరభంగమహర్షిని దర్శించి యనంతరమున రాముడు అగస్త్యాశ్రమ
మును జేరెను. ౧. అట నాతఁ డొసగిన ఇంద్రధనుస్సును శరములను
తీసికొని పంచవటియందలి లక్ష్మణునిచే నిర్మితమైన పర్ణశాలయందు
సీతతోఁగూడ చాలకాలము కాపురముండెను. ౨. ఒకానొక
హేమంతఋతువునందు రావణుని చెల్లెలగు శూర్పణఖ యను పేరు
గల, రక్కసి సౌందర్యవంతుడగు రాముని జూచి "నీవు నన్ను
పెండ్లియాడుము" అని నిర్బంధించెను. ౩. రామలక్ష్మణు లిరువురు
తన్ను పెండ్లియాడుట కిచ్ఛగింపనివారు కాగా సీతను చంపఁగోరి

మాహర్తు మిచ్ఛంతీ సాభ్యధావన్నిశాచరీ. ౪. ప. ప్రజావతీం జిఘాంసంత్యా స్తస్యాస్సౌమిత్రి రాత్మవాన్, ఛిత్వాఽఽకృష్య చ్ఛురికయా కర్ణనాస మభిద్రవత్. ౫. గ. తదను పరిదేవనరవేణ కులగిరిగహ్వరనిద్రాణకేసరిణ స్సముద్వేజయంతీ పలాయ్య జనస్థానం ప్రతి తత్ర నివసంతి చతుర్దశసహస్రాణి యాతూని తదధిపతీంశ్చ ఖరదూషణత్రిశిరసో దశకంధరబంధూ న్రఘుధురంధర నిరాకరణాయ నిర్యాపయతిస్మ. ౬. ప. ఆయాంతమసురానీక మాలోక్యావనిజాపతిః, ఆదిశ్య లక్ష్మణం సీతారక్షణే

---

ఆ నిశాచరి యామెపైపు పరుగిడెను. ౪. సీతను చంప నుంకించు చున్న యారాక్షసిని నాత్మవంతుడగు లక్ష్మణుడు పట్టి చురకత్తిచే నామె ముక్కు చెవులను తెగగోసెను. ౫. అది మొదలు నాబాధచే నేడ్చుచుండ ఆశబ్దమునకు కులపర్వతములందలి గుహాలలో నిద్రించుచున్న సింహములకుగూడ భయము కలుగుచుండెను. అటు లామె యేడ్చుచు పరుగున జనస్థానమును చేరి యందలి పదునాలుగు వేల రాక్షసులను వారి యధిపతులగు ఖరదూషణత్రిశిరులను రావణుని బందుగులను రాముని జయించుటకై ప్రేరేపించెను. ౬. అంతట సీతాపతి ఆ వచ్చుచున్న రాక్షససైన్యమును చూచి సీతను రక్షించుటకై సౌమిత్రిని నియమించి తాను విల్లమ్ములను గ్రహించి

సధనుర్వ్యయా. ౭. ప. రామ స్తతో రాక్షసవీర
వాహినీం వినాశయామాస శరౌఘవృష్టిభిః, జేతార
మాయాన్త మవేక్ష్య జానకీ సమాశ్లిష్యత్వరమాత్మ
వల్లభమ్. ౮. గ. తదను జనస్థానే విజనస్థానే సతి లంకాం
ప్రతి ప్రధావ్య సదసి నిపత్య చిరం విలప్య నివేదితో
దంతాం వికృతముఖీం శూర్పణఖాం దశముఖో విలోక్య
పటపటాకృత్య దంతాన్ సువర్ణహారిణవర్ష్మధారిమారీచ
సహాయః పరివ్రాజకభూమికాచ్ఛాదితో రఘుశార్దూల
పర్ణశాలాభ్యర్ణమాజగామ. ౯. ప. ఘనాన్ ఘనంతం
హారిణం సౌవర్ణం ప్రేక్ష్య మైథిలీ, 'ఆనీయ దేహి నా'థేతి

---

ఎదుర్కొనెను. ౭. రాముడా రాక్షససేనను బాణవర్షముచే నాశ
మొనరించెను. రాక్షసుల జయించి తిరిగి వచ్చుచున్న రాముని సీత
శీఘ్రముగా కౌగిలించుకొనెను. ౮. ఇటు లా జనస్థానము విజనము
కాగా శూర్పణఖ లంకకేగి సభ జొరబడి చాలసేపేడ్చి జరిగిన
వృత్తాంతమెల్ల రావణున కెఱుకపఱచెను. వికృతమైన రూపుగల
శూర్పణఖను రావణుడు చూచి పండ్లు పట పట కొఱికి బంగరు లేడి
రూపమునుదాల్చిన మారీచుడు తోడురా సన్యాసివేషము దాల్చి రఘు
రాము పర్ణశాలదరి చేరెను. ౯. లేతగరిక నమలుచున్న ఆ బంగరు లేడిని

ప్రేషయత్ప్రాణవల్లభమ్. ౧౦. దూరంగత స్తమసురం క్రియయా విభావ్య వివ్యాధ శాతవిశిఖేన రఘుప్రవీరః, చుక్రోశ దాశరథివత్స మృగో 'హతో ఽస్మి హాలక్ష్మణానుజ సఖే సఖి మైథి'లీతి. ౧౧. ౧. తేనా ర్తనాదేన విపన్నపరిత్రాతారమపి తమాపన్నం విజ్ఞాయ దేవరం ప్రేషితవతీం దశరథస్నుషాం దశవదనో బాహుభిర్నిజ రథమారోప్య తత్పక్షపాతేన యోద్ధు మభియాతస్య జటాయుషః పక్షపాతం విధాయ లంకాం ప్రవిశ్యాశోక వనికాయా మేనామతిభయంకరరాక్షసీపరివృతాం స్థాప

---

సీత గాంచి "నాథా! నా కా బంగరులేడి తెచ్చియి"మ్మని భర్తనంపెను. ౧౦. చాలదూర మేగినంత నాలేడిని చేతలచే రాక్షసునిగా నెఱిగి వాడితూపుచే గొట్టెను. అంత నామాయామృగము రాముని స్వరమువంటి స్వరముతో "తమ్ముడా! లక్ష్మణా! చచ్చితి. చెలీ సీతా! చచ్చితి" యని యాక్రోశించెను. ౧౧. ఆ ఆపదగొనియున్న వానిస్వరమును విన్న సీత విపత్తునొందిన వారినెల్ల రక్షించువాడైనను రాము డిపు డాపదనొందియున్నాడని తలంచి తనమఱదిని పంపెను. అంత ఒంటరిగానున్న దశరథుని కోడలైన సీతను రావణుడు చేతులతో తనరథ మెక్కించుకొని ఆమెయందలి యభిమానముచే యుద్ధమునకు వచ్చిన జటాయువు ఱెక్కలఖండించి లంక జేరి యశోకవనము

యాంబభూవ. ౧౨. స. అధ్వన్యాయాన్తమనుజ మాలోక్యోద్విగ్నమానసః, సీతామపశ్యన్నుటజే వ్యాలప ద్రాఘవ స్తతః. ౧౩. సీ. సీతాపతిర్ధరణిజామథమార్గమాణ శ్శీర్ణ ప్రతీక ముదితాసుర రాజకృత్యమ్, సంస్కృత్య గృధ్ర నృపతిం వికృతిం కబంధం కృత్వా విదోష మమలామ్బు మవాప సంపామ్. ౧౪. ఇత్యారణ్యకాణ్డః.

---

నందు రాక్షసస్త్రీల కాపుదలయం దుంచెను. ౧౨. మార్గమం దెదురైన తమ్ముని గాంచి ఉద్వేగము నొందిన మనసు కలవాడైన రాముడు పర్ణశాలలోని సీత గానరానందున బెట్టుదుఃఖించెను. ౧౩. రాము డాపై సీతను వెదకుచు త్రోవలో శిథిలములైన ఱెక్కలు గలిగి రావణు డొనరించిన కార్యమెల్ల దెలిపిన జటాయువున కగ్నిసంస్కార మొనరించి కబంధుని శాపమెడలించి స్వచ్ఛమైన ఉదకము గల పంపాసరస్సు చేరెను. ౧౪

# కిష్కిన్ధాకాణ్డః

ప. తతః కపిర్వాలిభయాన్నిలీన స్సుగ్రీవనామాచిర
మృశ్యమూకే, కోదండతూణీరధరౌ కుమారౌ దృష్ట్వా
బిభాయాగ్రజభృత్యమత్వా. ౧. ప. చికీర్షురేతస్య
హితం హనూమాన్ ధృత్వా పరివ్రాజకభూమికాం
ద్రాక్, గత్వా సమానీయ నరేంద్రపుత్రౌ మైత్రీమతా
నీత్ ప్లవగాధిపస్య. ౨. గ. తతః పరమన్యోన్య వినివేదిత
భూతపూర్వనిజకథౌ, కపినరవరౌ పరస్పరవైరివధాయ
విరచితసంగరౌ బభూవతుః. ౩. ప. సుగ్రీవవిస్రంభకృతేన

---

## కిష్కింధాకాండము

శ్రీరామలక్ష్మణులు పంపాసరస్సు కడ సంచరించుచున్నంత
వాలివలని భయమువలన చాలకాలమునుండి ఋశ్యమూక పర్వతము
నందు దాగియున్న సుగ్రీవుడను వానరరాజు విల్లును అంబులపొదిని
ధరించిన రామలక్ష్మణులను చూచి తనసోదరు డగు వాలియొక్క
బంటు లనెడు శంకచే భయమునొందెను. ౧. సుగ్రీవునకు మేలు
చేయగోరిన హనుమంతుడు సన్యాసివేసముదాల్చి శీఘ్రముగా వెడలి
ఆ రాజకుమారుల నిరువుర తోడుకొని వచ్చి సుగ్రీవునితో మైత్రి
గరపెను. ౨. అంత నా సుగ్రీవరామచంద్రు లొకరికొకరు తమతమ
పూర్వచరిత్రమును చెప్పికొని ఒండొరుల శత్రునాశనమునకై కృత
ప్రతిజ్ఞులైరి. ౩. ఇంద్రునితో సమానుడైన రాముడు సుగ్రీవునకు

ధుందుభేశ్శరీరముత్సార్య పదాంగుళీనఖాత్, సప్తాపిసాలాం
న్గిరినాగలోకాం బిభేద బాణేన బిడౌజసా సమః. ౪.
౫. తతః ప్రతీతః కపిపార్థివోఽస్యావృభుటిపుత్రేణ సమం
న్వయుధ్యత్, భ్రాత్రో స్తయోర్భేదమనాప్నువానో
బభూవ తూష్ణీం భరతాగ్రజన్మా. ౬. ౭. అథ స రఘు
కులతిలకో వాలిబలాసహిష్ణుతయా కాందిశీకమపత్ర
పావశాదవనతగ్రీవం సుగ్రీవం సుమమాలాలంకృతగ్రీవం
విధాయ వధాయ వాలినో విధత్స్వ యోధనమితి
పునర్న్యయూయుజత్. ౮. ౯. తథా కుర్వతి సుగ్రీవే

---

నమ్మిక కలుగుటకై తనకాలిగోట దుందుభి యను రాక్షసునిశరీరమును మీటి ఏడు మద్దిచెట్లను గిరిని నాగలోకమును ఒక్కబాణముచే ఛేదించెను. ౪. ప్రసిద్ధుడగు సుగ్రీవుడు వాలితో యుద్ధముచేసెను. భరతునియన్న యగు శ్రీరాముడా యుద్ధముచేయుచున్న యన్నదమ్ముల భేదమును గ్రహింపలేక (సుగ్రీవుడెవడో వాలి యెవడో తెలిసికొన లేక) ఊరకుండెను. ౬. వాలి బలిమిని సహింపలేక భయముచే దిక్కుఱుగక సిగ్గుచే తలవంచికొనియున్న సుగ్రీవునికంఠమును మాలచే నలంకరించి శ్రీరాముడు వాలి వధకై తిరుగ యుద్ధమును చేయుమని ప్రోత్సహించెను. ౮. సుగ్రీవు డాప్రకార మాచరింప

తరుస్కంధతిరోహితః, జఘాన రామో బాణేన వాలినం జయశాలినమ్. ౭. ప. తారా వరీముఖగణ స్తారేయ స్త రణేస్సుతః, భర్తృ నేతృ పితృ భ్రాతృ దుఃఖేన వ్యలప చ్చిరమ్. ౮. గ. తదను నిర్వర్తితసంగరో రఘు ధురంధరః పురందరతనయసౌర్ధ్వదైహికం కృతవంతం కపిపార్థివం త మభిషిచ్య రాజ్యే మాల్యవతి గిరావతి వాహయాంచకార వర్షాదివసాన్. ౯. గ. తతో రాజ్య సౌఖ్యానుభవప్రమత్తం మర్కటపతిం సౌమిత్రి ర్భీష యిత్వా రామనికటం నినాయ. ౧౦. ప. సీతాం విచేతుం ప్లవగా న్సర్వా నాహూయ భానవః, విధాయ మాస

---

చెట్టుమొదట దాగియున్న శ్రీరాముడు జయశాలియైన వాలిని చంపెను. ౭. అంత తార పతిదుఃఖముచేతను, వానరగణము ప్రభు దుఃఖముచేతను, అంగదుడు జనకదుఃఖముచేతను, సుగ్రీవు డగ్రజ దుఃఖముచేతను చాలసేపేడ్చిరి. పూర్తిచేయబడిన ప్రతిజ్ఞగల రఘు రాముడు అన్నగారి కపరకర్మల నాచరించిన సుగ్రీవుని రాజ్యమున నిలిపి తాను వర్షకాలమంతయు మాల్యవత్పర్వతమున గడపెను. ౯. రాజ్యసౌఖ్యముల ననుభవించుచు మత్తిలియున్న సుగ్రీవుని లక్ష్మణుడు భయపెట్టి రామసన్నిధికి చేర్చెను. సుగ్రీవుడు సీతను వెతకుటకై వానరులనందఱ రావించి ఒకనెలదినములు గడువొసగి దిక్కుల

మవదిం ప్రాప్యాపీత్సకలా దిశః. ౧౧. ప. హనుమజ్జాంబ
వదంగదనీలప్రముఖా యామ్యాం దిశమభియాతాః,
ద్వాదశ యోజనపరిమిత మిరిణం, ప్రాప్య శ్రాంతాః
ప్రయయుర్విపినమ్. ౧౨. ప. తతస్స్వయంప్రభాగుహాం
ప్రవిశ్య హేమపాదపాం మధూపహారపిస్మృతస్వకార్యరీత
యోఽభవన్, గతేఽవధౌ కదాచన ప్లవంగమేన కేన
చిత్ప్రబోధితా విలేపు రుచ్చకై రమీ ప్లవంగమాః. ౧౩.
గ. అథ గుహాధినాథా స్వయంప్రభా చేమాన్ రామదూ
తాన్విజ్ఞాయ ఫలైర్మధుభిశ్చ సమారాధ్య నిమీలితనయ

---

కన్నిటికి పనిచెను. హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు,
నీలుడు మొదలుగాగల వానరులు దక్షిణదిశకు బయలుదేరి
పండ్రెండు యోజనముల వైశాల్యముగల యెడారిని పొంది అలసిన
వారై ఒక యడవిని చేరిరి. అటనుండి బంగరు వృక్షములుగల
స్వయంప్రభయొక్క గుహ చేరి మధువు నాస్వాదించి తాము చేయ
వలసిన పనులను మరచినవారు అయిరి. గడువు గడచిన తరువాత
ఒకానొకవానరముచే మేల్కొల్పబడినవారై గట్టిగా నేడ్చిరి.
౧౩. అంతట నాగుహాధిపతియయిన స్వయంప్రభ వీరలను రామ
దూతలనుగా నెఱిగి మధువులతోడను ఫలములచేతను పూజించి
కండ్లుమూసికొనినవారిని క్షణమాత్రములో గుహనుండి బయటికి

నాక్ క్షణవేవ గుహాబహిర్విన్ధ్యగిరిం ప్రావేశయత్.
౧౮. ప. జానక్యలాభాత్సమయాతిపాతాత్ప్రాయోప
విష్టాన్ ప్రజగాద కీశాన్, సంపాతినామా సహజో జటా
యోర్లంకాపురస్థాం రఘువీరపత్నీమ్. ౧౯. ప. హృష్టా
స్సర్వే దశముఖపురీం యాతుకామాః కపీంద్రా దృష్ట్వాఽ
పారం జలధి మభవన్ దక్షిణం భగ్నవేగాః, తుష్టావాథ
శ్వపనతనయం జాంబవాన్పూర్వవేదీ తుష్టోఽసావప్యభవ
దుదధే ర్లంఘనే బద్ధసంధః. ౨౦.

ఇతి కిష్కిన్ధాకాణ్డః.

---

ప్రదేశమగు వింధ్యపర్వతమును చేర్చెను. జనకపుత్రికయగు సీతను చూడలేనందునను అవధికాల మతిక్రమించినందునను ప్రాయోపవేశము చేసిన యా వానరవీరుల నుద్దేశించి జటాయుసోదరుడగు సంపాతి "సీత లంకాపురియం దున్నది" అని చెప్పెను. ౧౯. ఆవార్తను విన్నందున మిక్కిలి సంతోషమునొందినవారై యావానరులు లంకాపురికి వెళ్లగోరినవారై దాటుటకు శక్యముగాని దక్షిణసముద్రమును చూచి భగ్నవేగులైరి. పూర్వచారిత్ర మెఱిగిన జాంబవంతు డంతట వాయుపుత్రుడయిన హనుమంతుని స్తోత్రము చేయ తృప్తినొందినవాడై అతడు సముద్రమును దాటుటకై సిద్ధమాయెను.

# సున్దర కాణ్డః

ప. తతో మహేంద్ర శిఖరాదుత్ప్లుత్య హనుమాన్ బలీ, సురసాసింహికే భిత్వా లఙ్కాబహిరవాతరత్. ౧.

ప. సాయం ప్రవిశ్య లంకాయాం సర్వత్ర విచికాయ సః, కుత్రాప్యదృష్ట్వా వైదేహీం రావణాంతఃపురం యయౌ. ౨.

గ. తత్ర రత్నపర్యఙ్కే రావణేన సహ శయానాం రతిమివ త్రిభువనసుందరీం మందోదరీం నిరీక్ష్య సమీక్షితా ఖలు సీతేతి ముదితః పవనతనయః కాకుత్స్థధర్మపత్నీ నైవం భవేదితి నిశ్చిత్య పురస్తాత్పానశాలామన్విష్య

---

## సుందరకాండము

జాంబవంతునిచే స్తోత్రము చేయబడి సముద్రముదాట నిశ్చయించిన బలవంతుడగు హనుమంతుడు మహేంద్ర పర్వతశిఖరమునుండి ఎగిరి సురసను సింహికను ఛేదించి లంకాపురి వెలుపల దిగెను. ౧. ఆసాయం కాలమున లంకను ప్రవేశించి అన్నియెడల వెదకెను కాని సీత యెచ్చటను కానరాలేదు. ఆపైని రావణాంతఃపురము చేరెను. ౨. ఆయంతఃపురమునం దొకయెడ రత్నపర్యంకమునందు రావణుగూడి నిద్రించుచున్న రతీదేవివలె త్రిలోకసుందరి యగు మందోదరిని చూచి "సీత చూడబడినది" అని (మొదట) సంతసించి (కొంతసేపటి తరువాత) కాకుత్స్థరామునిధర్మపత్ని యిట్టియన్యాయము నాచరించునా? అని

అశోకవనికాయాం పిశాచీభిరివ భయంకరాభీ రాత్రించరీభి ర్నిర్భర్త్స్యమానాం కనకసాలభంజికామివావనిదుహితరమవేక్ష్య తన్నివాసభూతస్య శింశుపాతరోరుపరి పత్రసఞ్ఛయే నిలీయ శృణ్వం స్తదాలాపానవతస్థే. ౩. ప. తతోఽతీతత్రియామాయాం త్రియామాయాం దశాననః, ప్రబుద్ధాగత్యవై దేహీం 'భవ భార్యే'త్యయాచత. ౪. ప. తృణాయ మన్యమానా సా రావణం రాక్షసేశ్వరమ్, నినింద వివిధై ర్వాక్యైః పరుషైః కర్ణదారిభిః. ౫. ప. అథ నక్తంచరపతౌ సీతయా ధిక్కృతే గతే, రాక్ష

---

యాలోచించి యీమె సీత కాదని తీర్మానించి యెదుట నున్న పానశాలను వెదకి యాపై యశోకవనమునందు పిశాచములవలె భయంకరాకారలగు రాక్షసస్త్రీలచే భయపెట్టబడుచున్న పుత్తడిబొమ్మవలె నున్న జానకిని చూచి యామె కూర్చున్న యశోకవృక్షపు టగ్రమున నాకుల నడుమ డాగి వారిమాటల వినుచుండెను. ౩. ఆరాత్రి మూడుజాములు గడచినపిదప రావణుడు నిద్ర మేల్కాంచి సీతయున్న యెడకువచ్చి యామెను "నాకు భార్యవు కమ్ము" అని ప్రార్థించెను. ౪. రాక్షసపతియైన రావణుని నొకగడ్డిపరకతో సరిగా తలచు నామె చెవులు చిల్లులపరచు నంతటి పరుషములైన యనేక వాక్యములచే నిందించెను. ౫. సీతచే తిరస్కరింపబడిన రాక్షసరాజు వెడలగా రాక్షసస్త్రీలు కోపముచే

స్యాః క్రోధసంరబ్ధా జానకీం సముత్తర్జయన్. ౬. (1) ప. అశ
క్నువంతీ తాం బాధాం సోఢుముద్బంధనాదసూన్,
మోక్తుం పాదపశాఖాయాం వేణీమాసంజయంత్యభూత్.
౭. (2) ప. తతోఽవతీర్య హనుమానభివాద్య మహీ
సుతామ్, దేవి! మాం విద్ధి రామస్య దూత మిత్య
బ్రవీ ద్వచః. ౮. ప. గణయంత్యా అథాత్మానం రావణం
కామరూపిణమ్, విశ్వాసాయ దదౌ ధీమా న్రామకా
మాంగులీయకమ్. ౯. ప. కథయామాస హనుమాన్కాకా
సురకథామపి, విస్రబ్ధా చాథ ముదితా జానకీ కపిమబ్ర
వీత్. ౧౦. ప. మాసే భవా న్రఘుపతిం సహ లక్ష్మణేన

---

సందడిపడుచు సీతను భయపెట్టిరి. ఆ బాధను సహింపజాలనిదై సీత ఉరిపెట్టుకొనుటచే ప్రాణముల విడుచుటకై ఆచెట్టుకొమ్మకు జుట్టును కట్టెను. అంతట నాంజనేయుడు చెట్టుదిగి నమస్కరించి సీత కిట్లనియె. "అమ్మా! నన్ను రామునిబంటుగా తెలిసికొనుము" అని చెప్పి, ఇష్టము వచ్చినరూపము నొందగల రావణునిగా తన్ను లెక్కించుచున్నసీతకు నమ్మికకై రామునినామము చెక్కబడిన యుంగరము నిచ్చెను. ౮. కాకాసురకథనుగూడ చెప్పెను. దాన నమ్మికకలిగినసీత ఆంజనేయుని కిట్లనియె. ౯. "ఓయీ! నీవు ఒకనెలదినములలో రామలక్ష్మణులను తీసి

నానేష్యతే యది భవామి పరాసురేవమ్, సందిశ్య వల్కదళయా పిహితం మహార్ఘం చూడామణిం కపివరస్య కరే దదౌ సా. ౧౧. 7. అథ గమనాయ తదనుమతి మవాప్య నిజాగమన మసురావనిజానే ర్బుబోధయిషు రశోకవనికా మభాఙ్క్షీత్. ౧౨. 7. విదితోదంతస్య పటపటాయితదంతస్య దశకంధరస్యాదేశేన సమాగతానశీతిసహస్రాణి కిఙ్కరాన్నామ రాక్షసాన్ ప్రహస్తసుతం జంబుమాలినం పంచ సేనాపతీన్రావణాత్మజ మక్షం చ దర్భి ర్నఖై ర్వాలేన పాదపై ర్గండోపలైస్తదాసీతై రాయుధైశ్చ క్షణేన నిహత్య సంవర్త

---

కొని రావేని ఇటుల ప్రాణము విడుచుదాన నగుదును.'' అని చెప్పి కొంగునగట్టిన వెలలేని చూడామణిని అతనిచేతి కిచ్చెను. ౧౦. అట నుండి వెళ్లుట కామెనుండి యనుజ్ఞగైకొని తనరాకను రాక్షసరాజున కెఱుక పఱుప దలచి అశోకవనమును విఱిచెను. ౧౧. ఈ వానరచర్య నెల్ల విని పండ్లు పటపట కొఱుకుచు రావణు డాజ్ఞసేయ (తన్నుపట్టు కొనుటకు)వచ్చిన యెనుబదివేల కింకరులను రాక్షసులను ప్రహస్తుని కుమారుడైన జంబుమాలిని యయిదుగురు సేనాధిపతులను, రావణు కుమారుడైన అక్షుని దంతములచే గోళ్లచే తోకచే వృక్షములచే పెను

సముయపమవర్తీ వావతస్థే. ౧౩. ప. అథేంద్రజిత్రా
ద్రుహిణాస్త్రబద్ధో విమోచితోఽభూచ్ఛణరజ్జుబంధైః,
తథాపి కార్యాయ నిబద్ధవత్కపి స్సభా మగాదాశ
రనాయకస్య. ౧౪. యుగ్మం. ప. తత్ర రాక్షసశార్దూలై
స్సేవితస్యాశరేశితుః, సింహాసనా దుచ్ఛ్రితరే వాలసేరహా
సనేస్థితః. ౧౫. ప. కస్త్వం కుతోఽసి కుత్రత్యః కిముద్దిశ్య
సమాగతః, ఇతి దైతేయపతినా పృష్టః పావనిరబ్రవీత్.
౧౬. గ. అస్తి కశ్చన రామోనామ దైతేయనిబర్హణే
ప్రాచీనబర్హిష స్సహాయస్య దశరథస్య జఠరాన్నిఖిలనిశా
చరభక్షణాయ ధరణ్యామవతీర్ణస్తాటకాటవీదవకృపీట

---

బండలచే వారివారి ఆయుధములచే గూడ నొక్కక్షణములో చంపి ప్రళయకాలమందలి యముడువలె నుండెను. ౧౩. తరువాత ఇంద్రజిత్తువే ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రముచే గట్టబడిన జనపమోకులకట్లు విడినను తాను తలచినపనిసాగుటకై కట్టుబడినట్లే రావణుని సభచేరెను.

అట రాక్షసశ్రేష్ఠులచే సేవింపబడుచున్న రాక్షసాధిపుని గద్దియకన్న నున్నతమై తోకచే కల్పింపబడిన సింహాసనమునందు కూర్చుండెను. ౧౪. "నీ వెవరు? ఎచ్చటనుండి దేని కోరివచ్చితివి." అని రావణు డడుగగా నాంజనేయు డి ట్లనియె. ౧౫. "రాక్షసుల చెండాడుటయందు దేవతలకు సహాయపడిన దశరథుని జఠరాగ్ని

యోనిః సుబాహుమారీచప్రముఖపలాశనజాలతూల వాతూలస్సాపరాధవిరాధవధవిధాయీ మందేతరకందర్పదర్పశూర్పణఖాముఖవికారకారీ ఖరదూషణప్రముఖరక్షోగణకక్షాశుశుక్షణిః శాపాంధకబంధప్రాణవిమోచనశ్చ. ౧౬. గ. కించ స్మరసి కిల ధనుర్గుణనిష్పందీకృతవింశతిభుజం వినిశ్వాసవ్యాదనపరంపరం భవంత మపరిమేయవీర్యార్జునః కార్తవీర్యార్జునః కారాగారేఽస్థాపయదితి. ౧౭. గ. తమపి విజితవతః పరశుధారయా క్షితి మక్షత్రియా మేక

---

నుండి సకలరాక్షసుల భక్షించుటకు నుద్భవించినట్టియు తాటక యనెడు వనమునకు కార్చిచ్చును, సుబాహువు మారీచుడు నాదిగా గల రాక్షససమూహ మనెడు దూదిపింజకు గాలివంటివాడును, అపరాధియైన విరాధునకు హంతయు, “నే నందరికన్న నందకత్తె” నను గర్వముగల శూర్పణఖముఖమును వికారముగా జేసినవాడును, ఖరదూషణాదుల కగ్నిహోత్రునివంటి వాడును శాపవశమున గుడ్డివాడైన కబంధుని ప్రాణముతీసిన రాము డను ప్రసిద్ధపురుషు డొకడున్నాడు. ౧౬. అల్లెత్రాటిచప్పుడుచేతనే నీయిరువదిచేతుల నరికట్టి నిట్టూర్పులు విడుచుచున్న నిన్ను కారాగారమున నుంచిన లెక్కలేని పరాక్రమముగల కార్తవీర్యార్జునుని మరువలేదుగదా? ౧౭. అట్టి కార్తవీర్యార్జునుని జయించి గండ్రగొడ్డలియంచుచేతనే యిరువది యొక్క సారులలో భూమినెల్ల క్షత్రియశూన్యముగ నొనరించిన

వింశతికృత్వః కృతవతో జామదగ్న్యస్య గర్వదహన నిర్వాపయితాఽయమ్. ౧౭. అపిచ. గ. వ్యస్త్రాగ్నేః కిమఖిల లోకాభినందనీయబాహుబలశాలీ వాలీ స్వజిఘృక్షయోపేత్య పృష్ఠత స్సమాశ్లిష్టవంతం భవంత మజానాన ఇవ వాలధినా తవ శిరగకరపాదం నిశ్చలం నిర్బధ్య నిత్యకృత్యానుష్ఠానవశాచ్చతురర్ణవామ్భసి నిమజ్జయ్య సమాగచ్ఛ న్కిష్కింధాం కిమయం మహారాజస్య వాలధౌ జలనిధినిమజ్జనసమయసంలగ్నో జలూకావిశేష ఇతి సవినయం విజ్ఞాపయద్భిర్వానరవరైః ప్రతిబోధితో ఘృణాభావం ధృతవానితి. ౧౮. గ. తమపి ప్రియసుహృద

---

పరశురాముని గర్వాగ్నిని చల్లార్చిన మహానుభావు డీరాముడు. ౧౭. సకల లోకములచే కొనియాడదగిన భుజబలముగల వాలి తన్ను జయింపవలె నని వెనుకనుండివచ్చి కౌగిలించిన నిన్ను తెలియనివాని వలెనే తన పెనుతోకతో ఆపాదమస్తకము కదలికలేనట్టు కట్టి తన నిత్యకృత్యముల ననుష్ఠించుకొను సందర్భమున నాల్గుసముద్రముల నీట ముంచి తిరిగి కిష్కింధకు వచ్చుచుండ ఆనగరమునందలి వానర వరులు 'మహారాజా! సముద్రమున మునుగునపు డీజలగ మీ పెను తోక బట్టియున్నది" అని తెలుపుటచే జ్ఞప్తికితెచ్చుకొని క్షుద్రకీటక మనుబుద్ధిచే విదలించినవాలిని మరువలేదుగదా? ౧౮. అట్టివానినే

స్సుగ్రీవస్య ప్రియతమాపహారణకోపే నైకేనైవ బాణేన కృతాంతనిశాంతాతిథీకృతవానయమ్. ౨౦. గ. ఏవం విధ స్సపురుషోత్తమో లంకామిమాం భస్మసాత్కర్తు మాజ్ఞామాత్ర ప్రతీక్షమాణేన సుహృదా చ సుగ్రీవేణా మదన్యవానరవరకోటిభిరుపాస్యమానేన సహ మహాంతం మాల్యవంతం సానుమన్తం సురాలయం సురాధిప ఇవాధివసతి. ౨౧. గ. పురుషాధమస్తు భవా న్పంచానవయోః పురత స్థ్సాతు మశక్తో జంబుక ఇవ బహిర్గతయో స్తయోర్త్మనుజసింహయోః పరిగృహీతపరివ్రాజకభూమికః ప్రవిశ్య పర్ణశాలా మనఘాం జనకనందినీ మచూచురత్కిల. ౨౨. ప. తస్యా మార్గగవేషణాయ కపిషు

---

యీరాముడు తనచెలికానిభార్య నపహరించె నని కోపగించి యొక్క బాణముతోడనే కూలనేసెను. ౨౦. అట్టి పురుషశ్రేష్ఠుడైన రాముడు మాల్యవత్పర్వతమునం దింద్రుడు స్వర్గమునందువలె నివసించు చున్నాడు. ౨౧. రాము డనుజ్ఞ నొసంగినంతమాత్రమున లంకనెల్ల బూడిదచేయగోరు సుగ్రీవుడును నావంటి యనేక వానరశ్రేష్ఠులును నాతని సేవించుచున్నారు. నీచుడ వగు నీవు సింగములయెదుర నక్క నిలువలేనటు లాపురుషశ్రేష్ఠులైన రామలక్ష్మణులు ఆశ్రమము వెలుపలి కేగ సన్యాసిరూపు గ్రహించి అందు ప్రవేశించి పాపములు

ప్రస్థాపితేష్వేకక స్తీర్త్వాఽహం జలధిం ప్రవిశ్య నగరీం
దృష్ట్వా విదేహాత్మజామ్, జ్ఞాతవ్యం భవతా సమాగమన
మిత్యారామభంగం వ్యథాం వీరానప్యహనం రణే
దశముఖ జ్ఞాతం కిమాద్యం తతః. ౨౩. ప. జాయా
విధేయేత్యమతిర్భవాన్యా మిచ్ఛత్యపాపాం రఘు
వీరపత్నిమ్, త్వత్ప్రాణవాతాహరణాయ జాతాం
జానీహి తాం కాలభుజంగకన్యామ్. ౨౪. ప. సఖా తే
సుగ్రీవో హితమవదదార్యాం జనకజాం రఘు
శ్రేష్ఠం రామం గమయ కరిణీం కుంజరమివ, న చేదేవం
రామానుజశరశతైర్యాతునగరీ భవేద్విశ్వస్తానాం

---

లేని సీతను దొంగిలించితివి గదా? ఆమె త్రోవ తెలియుటకుగా బయలుదేరినకపులలో నే నొంటరిగాడ నీ సముద్రమునుదాటి లంకాపురిని ప్రవేశించి జానకిని చూచి నారాక నీ కెఱింగించుటకై యీవనభంజనమును వీరులను చంపుట మొదలగువానిని చేసితిని. సంగతినంతయు నెఱిగితివా? పాపరహితయగు శ్రీరామచంద్రునిభార్యను బుద్ధిలేని నీవు పెండ్లాముగా చేసికొన చూచుచున్నావు. కాని యామె నీప్రాణవాయువుల నపహరింపబుట్టిన కాలాహికన్య యని తెలిసికొనుము. నీ మిత్రుడగు సుగ్రీవుడు "ఓరావణా! మగఘేనుగు నాడయేనుగువలె పూజ్యురాలయిన సీతను రామునితో కలుపుము.

విలపనరవై ర్నాదితదిశా. ౨౫. ప. ఏవం బ్రువాణస్య సమీరసూనో ర్వధం సమాజ్ఞాపయ దాశరేంద్రః, దూతా న వధ్యా భువనేషు వీరై రితి న్యషేధ త్తమథో విభీషణః. ౨౬. ప. పట్టైస్సంవేష్ట్య తైలేన సిక్త్వా సంయుజ్య వహ్నినా, వాల మస్య దశగ్రీవః కారయామాస ఘోషణామ్. ౨౭. గ. విదితవృత్తాంతయా నితాంతతాంతయా ధరాసుతయా 'యద్యహం పతివ్రతా శీతోభవ హనూమత' ఇతి శాపితం నిజలూమలోమాప్యదహంతం శిఖావంత మవేక్ష్య శాఖామృగవరిష్ఠః ప్రహృష్టమనా విచ్ఛిద్య

---

అటుకానిచో దిక్కులుపిక్కటిల్లు విధవారోదనములతో నీనగరము నశించునట్లు లక్ష్మణునిశరములు చేయగలవు." ఇటులు పలుకుచున్న వాయుపుత్రుని "జంపు"డని రావణు డాజ్ఞ చేసెను. "రాయబారులను వీరులు చంపరాదు" అని విభీషణుడు దానిని వారించెను. అంత రావణు డీ ఆంజనేయునితోకను గుడ్డలతోచుట్టి తైలమున తడిపి నిప్పువెట్టి చాటింపుచేసెను. జానకి ఈవిషయము నెఱిగినదై మిక్కిలి చింతనొంది, "నేనే పతిభక్తిగలదాననైనయెడల హనుమంతునకు జల్లనివాడవు కమ్ము" అని అగ్నిహోత్రుని శపించెను. అట్లు శాపము నొందినందున తనతోక వెండ్రుకనైన కాల్చని యగ్నిహోత్రుని గాంచి మనమున సంతసించిన కపిశ్రేష్ఠుడైన హనుమంతుడు కట్టు

బంధాన్నిష్పిష్య ఘోషయతో నిశాచరాన్భస్మీకృత్య కృష్ణవర్త్మనా తేనైవ లంకాం ప్రణమ్య జానకీం నిస్తీర్య జలధిమానందయామాస సీతోదంతకథనేన జాంబవ దాదీన్వాహినిపతీన్. ౨౮. ప. తత. ఉచ్ఛ్రితలాంగూలాః ప్లవగేశాః ప్రతస్థిరే, ప్రవృత్తిమేతాం సీతాయా రామా యాశు వివక్షితః. ౨౯. ప. పథి స్థితం మధువనం సుగ్రీ వస్య వలీముఖాః, ప్రవిశ్య మారుత్యాదేశా త్వపుర్మధు పిపాసితాః. ౩౦. గ. అమూచ తత్రాత్మనో నివారయంతం వనపాలకదధిముఖం భూరిదంతజిహ్వాదినిజావయవదర్శనా

---

త్రెంచుకొని కోలాహలము సేయుచున్న రాక్షసులను నుగ్గుచేసి వారలు తన తోకను నంటించిన యగ్నిహోత్రముచేతనే లంకనెల్ల బూడిద చేసి సీతకు నమస్కరించి సముద్రమును దాటి జాంబవంతులు మొద లుగాగల సేనాపతులకు సీత చారిత్రము తెలుపబఱచి సంతసపెట్టెను. ౨౮. అంత సీత చారిత్రమును రామున కెఱుకపఱుచుతలపున తోకల నెత్తుకొని వానరవరులు బయలువెడలిరి. అటు లా వానరవరులు పోవుచు త్రోవలోనున్న సుగ్రీవుని మధువనమును బ్రవేశించి దాహము గొనియున్నవా రగుట యాంజనేయుని యాజ్ఞనొంది మధువు నానిరి. ౩౦. త మ్మడ్డగింపవచ్చిన దధిముఖుడను తోటమాలిని బొమముడిచే

దినా పరిహాసేన దంతైర్దంశనేన నఖై ర్విదారణేన పాణి
భ్యాం చపేటాప్రదానేన పాదై రాఘాతేన దండై
స్తాడనేన వృక్షైః ప్రహారేణ గండోపలైః పిండీకరణేన చ
తం కాందిశీకం విధాయ సత్వరం ప్రధావ్య సలక్ష్మణ
సుగ్రీవం రాఘవమహమహమికయా ప్రణేముః. ౩౧. ప.
సీతాప్రవృత్తిం విజ్ఞాప్య రాఘవాయాంజనాత్మజః, సర్వ
స్వదానసదృశం రామాలింగనమన్వభూత్. ౩౨.

ఇతి సుందరకాండః.

---

పండ్లిగిలించుటచే నాలుక చాచుటచే చేతుల నల్లార్చుటచే నటులనే మిగిలిన యవయవములు చాపుటచే నెగతాళిచేసి పండ్ల గొఱికి గోరట గీఱి చేత జెంపవేయుచు కాల తన్నుచు కట్టెలతోడ చెట్టులతోడ కొట్టి పెనుబండల నుగ్గునేసి వానిని భయముచే దిక్కుఱుగని వానినిగా జేసి నేను ముందు నేను ముందనుచు శీఘ్రముగ బరువిడి సుగ్రీవలక్ష్మణులతో గూడిన రాముని జేరి నమస్కరించిరి. ౩౧. ఆంజనేయుడు జానకి చరిత్రమెల్ల రామున కెఱుకపఱచి మిక్కిలి గొప్పదైన రామునికౌగిలిని బొందెను. ౩౨.

# యుద్ధకాణ్డః

ప. అథ నిశాచరనాథపురస్థితాం జనకజా మవకర్ణ్య
రఘూద్వహః, సమవలోకత తూణయుగం ధనుః ప్రళయ
పావకదాహికయా దృశా. ౧. గ. అథ సుగ్రీవనిదేశప్రచ
లితమాంజనేయతారేయసమారూఢరామలక్ష్మణనిరీక్ష
ణద్విగుణితరణోత్సాహం ప్లవంగమర్క్షగోలాంగూలబల
ముత్ప్లవనేనైవ విలంఘితనగనదీవిపినం సముద్రధివేలా
నిలమనోహారే మహేన్ద్రశిఖరకాంతారే ఫలమధూపహా
రేణాధ్వశ్రమ మపానయత్. ౨. గ. తదను దశముఖశ్చా

---

## యుద్ధకాండము

అంత రాముడు సీతను రావణుని లంకయం దున్నదానినిగా
నెఱిగి తన రెండమ్ముల పొదులను విల్లును విలయకాలాగ్నివంటి
చూపున జూచెను. సుగ్రీవు ననుజ్ఞచే బయలువెడలి యాంజనే
యాంగదుల నెక్కియున్న రామలక్ష్మణుల జూచి యిబ్బడియైన
సంతసముతో కోతుల నెలుగుల కొండముచ్చుల సమూహములు
గంతులతోడనే నదులను, కొండలను, అడవులను దాటి సముద్రము
నొడ్డున నున్న గాలిచే మనోహరమైన మహేంద్ర పర్వతపు టడవి
యందలి పండ్లను, మధువును భుజించుటచే మార్గాయాసము నడుపు
కొనెను. ౨. అపుడు రావణుడు వేగులచే జయించుటకు శక్యము

రముఖా దజేయ మాతంగ ప్లవంగమబల మాకర్ణ్య కిం కర్తవ్యతామూఢః ప్రహస్తముఖమంత్రిసంధుక్షితాయో ధనోత్సాహో హితైషిణం రాఘవాయ సీతాసమర్పణ ముపదిశంత మనుజం విభీషణం సదసి ధిక్కృత్య నిస్సారయాం బభూవ. 3. ప. తతస్సమాగత్య పదోః పతంతం విభీషణం ద్రాగభిషిచ్య రాజ్యే, ఉపేక్షమాణం జలధిం నిజార్థనాం ధనంజయాస్త్రేణ దదాహ రాఘవః. ౪. ప. పాదయోః పతితేనాథ సింధునా దర్శితే స్థలే, కపివీరాహృతైశ్శైలైర్నలం సేతు మచీకరత్. ౫.

కాని వానరసైన్యమును వచ్చినదానినిగా విని యేమిచేయుటకును దోచనివాడై ప్రహస్తుడు మొదలగు మంత్రులచే నభివృద్ధిపొందింపబడిన యుద్ధోత్సాహముకలవాడై "రాఘవునకు సీతను సమర్పింపుము" అని యుపదేశించు తన మేలుకోరు తమ్ముడైన విభీషణుని సభయందు తిరస్కరించి వెడలగొట్టించెను. 3. అటు లన్నగారిచే వెడలగొట్టబడి రాము డున్నయెడకు వచ్చి శరణు శరణని పాదములపైబడిన విభీషణుని రాజ్యమునందు నిలిపి తన కోరిక నొప్పరికించుచున్న సముద్రుని రాము డాగ్నేయాస్త్రమునేసి తాపము నొందించెను. ౪. ఆ తాపము నోర్వలేని సముద్రుడు రాముని పాదములపైబడి వారు సముద్రమును దాట ననువగు నెడమును జూప

౫. అథ. విలంఘితసాగరస్య ప్రవిష్టసువేలాచలస్య వలీముఖబలస్య పరిమాణ మవగంతు మాగతాభ్యాం కపివరసందానితప్రహృత మూర్ఛితాభ్యాం దయాశరథినా దాశరథినా విమోచితాభ్యాం శుకసారణాభ్యాం విదిత నిఖిలవృత్తాన్తో దశాననో విద్యుజ్జిహ్వముపహ్వరే కిమప్య కథయత్. ౬. ప. మాయావినా తేన పురో వినిర్మితం నిరీక్ష్య భర్తుస్సశిరశ్శరాసనమ్, మమూర్ఛ సీతా సరమా విభీషణప్రియా సమాశ్వాసయదాప్తభాషణైః. ౭. ప. రా

---

వానరులు తెచ్చిన కొండలచే నొక సేతువును నలునిచే నేర్పాటు చేయించెను. ౫. వారధి నిర్మాణమైనంతనే సముద్రమును దాటి సువేల యను పర్వతమునందు విడిసిన వానరసైన్యముయొక్క పరిమాణ మెఱుగుటకై వచ్చిన శుకసారణు లను నిద్దఱు రావణ సేవకులు వానరవీరులచే కొట్టబడి మూర్ఛనొందినవారై కరుణా సముద్రుడగు రామునిచే విడువబడినవారై రావణు నాస్థానముచేరి జరిగిన సంగతియంతయు దెలుప రావణుడు విద్యుజ్జిహ్వునకు నేకతమున నేమియో చెప్పెను. ౬. మాయలమారి యగు విద్యుజ్జిహ్వునిచే నెదుట పెట్టబడిన రాముని శిరసుతో గూడిన విల్లును జూచి జానకి మూర్ఛనొందెను. అట్టి యాసీతను విభీషణుని భార్య యగు సరమ హితమును గోరువారు చెప్పుమాటలచే నోదార్చెను. ౭.

మాయ సీతాం దిశ రావణేతి హితం తతో బోధయతిస్మ మా
ల్యవాన్, రక్షోధిపస్తం పరిహాస్య సేనాం రణాయ సన్నా
హావతీం చకార. ౮. ప. పశ్చాద్వానరవాహినీప్రమథితాం
రక్షోధిపాక్షౌహిణీమాలోక్యేన్ద్రజిదాశుగాన్ ప్రవికిర
న్నప్యంగదేనాహతః, లీనో వ్యోమని మాయయా నృప
సుతౌ బద్ధోరగాస్త్రైః పురీం గత్వా తాతమలోక యజ్జన
కజాం దుఃఖార్ణవే మజ్జయత్. ౯. క. అథ యదృచ్ఛాసమా
గతవినతాసుతగరుద్వాతనిర్ధూతవాతాశనాస్త్రౌ రాజపు
త్రావవలోక్యాహవోత్సాహవత్సు క్రవ్యాత్సు హనూమ

---

“ఓ రావణా సీతను రామునకు సమర్పింపుము” అని మంచిని బోధిం
చిన మాల్యవంతుని రక్కసులఱేడెగతాళిసేసి సేననెల్ల అతనికి
సాయత్తపఱచెను. ౮. అటుపై యుద్ధమున వానరసేనచే గల్లోల
పఱుపబడిన రావణసైన్యమును గాంచి ఇంద్రజిత్తు కపివీరులపై బాణ
ముల విసజల్లెను. అట్లైనను అంగదునిచే గొట్టబడి ఆకాశమున
రాక్షసమాయచే దాగి రామలక్ష్మణులను నాగాస్త్రములచే బంధించి
లంకజేరి తనతండ్రిని జూచెను. సీతను దుఃఖసముద్రమున ముంచెను.
౯. అంతట కాకతాళీయముగా వచ్చిన గరుత్మంతుని ఱెక్కలగాలిచే
విదలింపబడిన నాగాస్త్రములు గల రామలక్ష్మణులను జూచి రాక్షసు
లాహవోత్సాహమునొంద హనుమంతుడు, అంగదుడు మొదలుగా

దంగదప్రభృతిభిర్నిహతాన్ ప్రహస్తప్రభృతీన్వాహినీ
పతీనవకర్ణ్య రథాధిరూఢో జగద్భయంకరేణాకారేణసాక
మనీకాయ సమాటీకత రావణః. ౧౦. ప. సాలాన్ గిరీంశ్చ
నుదతీం కపివీరసేనా ముత్సార్య బాణనివహైర్భువిలక్ష్మణం
సః, శక్త్యా నిపాత్య రఘునాయకసాయకౌఘైః ప్రాణావ
శేషితతను ర్నగరీం దధావ. ౧౧. ప. కుంభకర్ణ మథ జన్య
భూగతం భక్షయంత మఖిలా న్వలీముఖాన్, భూసుతా
పతి రసూదయ త్తతః పుష్పవృష్టి మకరో త్సురవ్రజః.
౧౨. ప. సురాంతకనరాంతకప్రభృతిరాక్షసానీకినీపతిష్వ
నిలపాకశాసనిసుతాదిభిస్సంయుగే, హతేషు పురుషర్షా

---

గల వానరవీరులచే గొట్టబడినవారిగా ప్రహస్తుడాదిగాఁగల రాక్షస
సేనాపతుల నెఱిఁగి లోకముల కులుకు కలిగించు రూపుగల రావణుడు
తేరునెక్కి యుద్ధమునకు బయలువెడలెను. ౧౦. వృక్షములను,
పర్వతములను తనపై విసరుచున్న వానరసేనను పెక్కుబాణములచే
దొలగించి శక్తిచే లక్ష్మణుని పడవైచి రామునిచే వేయబడిన బాణము
లచే ప్రాణావశిష్టుడై పట్టణమునుగూర్చి పరుగిడెను. ౧౧. రణరంగము
నందలి వానరవీరుల మెక్కుచున్న కుంభకర్ణుని సీతాపతి చంపెను.
అంత దేవతలు కుసుమవర్షమును కురిసిరి. ౧౨. అటు లాయుద్ధమునందు
సురాంతకుడు నరాంతకుడు మొదలుగాఁగల రాక్షస సేనాధిపతుల

తజిద్ధనుమద్భృత్యసేనాపతీ విహాయ సహరామలక్ష్మణామ మూర్ఛయద్వాహినీమ్. ౧౩. ప. ఋక్షాధిపనియోగేన వేగేన పవనాత్మజః, సంజీవినీలతాధార మానయామాస భూధరమ్. ౧౪. ప. సంజీవినీగిరిసమీరసముచ్ఛ్వసద్భిః శ్శాఖామృగైః కలుషితాం నగరీం విహాయ, యుద్ధాయ సంగతవతో మకరాక్షకుంభపూర్వాన్ రఘూత్తమకపీశముఖా నిజఘ్నుః. ౧౫. ప. పునర్దశముఖాత్మజో గగనలీన ఏవాశుగాన్ ప్రవర్ష్య భరతాగ్రజక్రుధమవేక్ష్య లంకాగతః, ప్రతీచిపురతోరణే హనుమతః పురః పశ్యత

---

నాంజనేయుడు సుగ్రీవుడు మొదలగు వానరవీరుల రూపుమాప ఇంద్రజిత్తు హనుమజ్జాంబవంతులదక్క దక్కిన వానరసైన్యమును రామలక్ష్మణులను గూడ మూర్ఛనొందించెను. ౧౩. జాంబవంతుని పనుపున నాంజనేయుడు సంజీవినిలత గల పర్వతమును గొనితెచ్చెను. ౧౪. సంజీవినీ పర్వతపు గాలిచే తెలివినొందిన వానరులచే కలవర పెట్టబడిన లంకను విడిచి యుద్ధరంగమునకు వచ్చిన మకరాక్షుడు మొదలుగాగల రాక్షసులను రాముడును తక్కుంగల వానరపతులును తుదముట్టించిరి. ౧౫. మరల మొయిళులచాటున జేరిన యింద్రజిత్తు శరములకురిసి రాము కోపమును గాంచి లంక కేగి యట పడమటి బహిర్ద్వారతోరణమున నాంజనేయుడు చూచుచుండ మాయా

శ్చకర్త జనకాత్మజాం క్రకచకేన మాయామయీమ్. ౧౬. స. తస్మిన్నిరాశే రఘునాయకాంతికం గంత ర్వ్యయం ప్రాప్య నికుంభిలాం మఖమ్, ఆరబ్ధవాన్రాఘవలక్ష్మణౌ తత స్స్వతాశుచాఽతీవతరాం విషీదతుః. ౧౭. స. విభీషణాశ్వాసితరాఘవాజ్ఞయా గతైర్హనూమత్ప్రముఖై ర్వలీముఖైః, వినాశితే కర్మణి రోషభీషణస్సమాగమచ్ఛక్రజయీ రణాంగణమ్. ౧౮. స. తత్స్యందనోన్నతతరే పవనాత్మజస్య స్కంధే నివిశ్య వినిపాత్య కరాననేకాన్, సౌమిత్రిరచ్ఛినదముష్య శిర శ్శరేణ పౌరంద

---

నిర్మితయగు సీతను ఱంపముచే కోసెను. ౧౬. సీతయెడ నాసదక్కిన వాయుపుత్రుడు రాముదరిచేర నీ రావణమిత్రుడు నికుంభిల యను యాగమును జేయ మొదలిడెను. సీత కిట్టి యాపద సంభవించె నను దుఃఖముచే రామలక్ష్మణులు మిక్కిలి విచారించిరి. ౧౭. అట్టి రాముడు విభీషణునిచే నోదార్చబడి వానరులకు నాజ్ఞ సేయ హనుమంతు డాదిగాగల కపివీరు లాయింద్రజిత్తుని జన్నమును పాడుచేసిరి. అస లా కర్మము పాడగుట చెడ్డకోపమున రావణపుత్రుడు యుద్ధరంగమును జేరెను. ౧౮. ఆ మేఘనాథుని రథ మంతటి యున్నతముగ నున్న వాయుపుత్రునిభుజము నెక్కిన సౌమిత్రి లెక్కకు మించిన బాణములనేసి కడకు నైంద్రాస్త్రమున నాతని శిరసు తెగనేసెను.

రేణ విబుధాః కుసుమాన్యవర్షన్. ౧౯. ప. శక్రారౌ నిహతే సుతే దశముఖ శ్శోకాబ్ధిమగ్న శ్చిరం ప్రేయస్యాః ప్రతిరోధమప్యగణయ న్లోకైకవీరాగ్రణీః, విశ్వస్తాపతిదేవనారవవినిర్భిన్నాఖిలాశాంచలాం లంకాం ప్రేక్ష్య రణాంగణం ద్విగుణితక్రోధ స్సమాగా త్తతః. ౨౦. ప. కపీన్కృపాణేన విదారయ న్నయం బభూవ సౌమిత్రిశరై రనుచ్ఛ్వసన్, ప్రయుజ్య శక్తిం భువనైకభీషణా మమూర్ఛయ ల్లక్ష్మణ మింద్రజి ద్రిపుమ్. ౨౧. ప. సంజీవినీమారుతిజీవితానుజం సమీక్ష్య రామో రఘువంశవర్ధనః,

---

సురలు సుమముల కురిసిరి. ౧౯. లోకముల నెదురులేని వీరు డగు రావణుడు తనకొమరు డగు నింద్రజిత్తు శత్రువులచే మ్రందింపబడుట నెఱిగి దుఃఖసంద్రమున మునిగి ప్రియురాలగు మండోదరి యడ్డగించుచున్నను లెక్కగొనక విధవలగు రాక్షసస్త్రీల దీనాలాపములచే దిక్కులు పిక్కటిల్లు లంకాపురిని గాంచి ఇబ్బడి యగు రోసమున అనికేగెను. ౨౦. అట వానరులనెల్ల ఖడ్గమున కోయుచు లక్ష్మణుని బాణములచే నూపిరిసలపనివాడై లోకభయంకరమైన శక్తినేసి యాలక్ష్మణుని మూర్ఛనొందించెను. ౨౧. సంజీవినీలతలనుండి ప్రసరించిన వాయువువలన జీవించిన సోదరుని గాంచి శ్రీరాముడు సంతసించి

ఆఖండలప్రేషితముచ్చవాజినం సమారురోహాథ సమాతలిం రథమ్. ౨౨. గ. అథ దశరథతనయదశవదనయో ర్వారుణవినివారిత వైశ్వానరం వైనతేయసముత్సారిత దాందశూకం వాతాస్త్రవినిర్ధూతజైమూతం వైకర్తనవినివర్తితతామిస్రం వాసవనిష్కాసితదానవం వాసుదేవప్రచలాయితవామదేవమమ్బరతలనివిష్టసురముని ప్రభృతిభిరత్యాదరేణావలోక్యమానముదభూదభూతపూర్వ మాయోధనమ్. ౨౩. ప. శిరస్సు లూనేష్వపి వైరిణాస్తతః పునఃపునః కందళితేషు రాఘవః, విధేః ప్రయుజ్యా

---

ఇంద్రుని పనుపున వచ్చిన ఉన్నతమైన గుఱ్ఱముల పూన్చి నొగల నెక్కిన మాతలిగల రథము నెక్కెను. ౨౨. అపు డా రామ రావణుల కాకసమున మునులు దేవతలు చేరి మిగుల ఆదరమున చూచుచుండ అదివఱ కెఱుగని పెనుపోరు సాగెను. అందా రావణుని యాగ్నేయాస్త్రము రాముని వారుణాస్త్రమున నడ్డగింపబడెను. నాగాస్త్రము గారుడాస్త్రమునను, జీమూతాస్త్రము వాయవ్యాస్త్రమునను, తామిస్రము ఆగ్నేయాస్త్రమునను, రాక్షసాస్త్రము ఐంద్రాస్త్రమునను, వామదేవాస్త్రము వాసుదేవాస్త్రమునను నడ్డగింపబడెను. ౨౩. ఆవల నా రావణుని శిరము లెన్నిసారులు తెగ నేసినను మరల మరల మొలకలెత్తుట రాముడు చూచి కడకు

స్త్ర మథ జ్వలచ్ఛిఖం జఘాన తం లోకవిరోధినం రణే.
౨౮. ప. తదా వినేదుస్సురభేరికా భృశం జగుః కలం
నాకసదాం కుశీలవాః, అనర్తిషుశ్చాప్సరసురాంగనా
స్సురా రఘూత్తమం కల్పసుమైరవాకిరన్. ౨౯. ప.
త్రిలోకవిఖ్యాతమహాభుజే మృతే రిపావపి భ్రాతరి రాక్ష
సాధిపే, కృతాత్మనిందో విలలాప మూర్ఛితో విభీషణో
గద్గదభాషణ స్తతః. ౩౦. ప. మందోదరీప్రభృతయో
రజనీచరయోషితః, విలేపుః పతిపుత్రాదీన్వీలోక్య గత
జీవితాన్. ౩౧. ప. పరేతవర్గాయ నివాపపూర్వికాః
క్రియావితన్వంతమముం విభీషణం, విధాయ లంకాధిపతిం

---

ప్రకాశించు శిఖలుగల బ్రహ్మాస్త్రము నేసి లోకములకెల్ల శత్రువగు రావణుని చంపెను. ౨౮. అంత దేవదుందుభులు మ్రోసెను. దేవలోకమునందలి వైతాలికులు పాడిరి. అచ్చర లాడిరి. కల్పవృక్షపు పూలు రాముపై చల్లిరి. ౨౯. ముల్లోకముల పేరువడసిన భుజపరాక్రమముగల రావణుడు తనకు శత్రువైనను సోదరు డగుట నాతడు మరణించినంతనే గద్గదస్వరమున తన్ను తాను నిందించుకొనుచు విభీషణుడు దుఃఖించెను. ౩౦. మందోదరి దొట్టి రాక్షసస్త్రీలు గతించిన పతులను పుత్రులను గాంచి చాల దుఃఖించిరి. ౩౧. చనిపోయిన రాక్షసులకెల్ల తిలాంజలుల నిప్పించి విభీషణుని

ప్రవేశనా త్పవిత్రితాగ్నిం జగృహే స జానకీమ్. ౨౮.
ప. సహ ప్లవంగై రధిరుహ్య పుష్పకం విమాన మూర్వీతన
యాం ప్రతి ప్రభుః, సముద్ర రోధశ్శయనాదికాః కథాః
వదన్ భరద్వాజ తపోవనం యయౌ. ౨౯. యుగ్మం. ప.
తదాతిథేయం ప్రతిగృహ్య నాగరైః ప్రమోదమానై
ర్భరతాగ్రగామిభిః, వియుక్తవత్సాభినవప్రసూతికా గవీ
సనృతూభిరపి స్వమాతృభిః. ౩౦. వసిష్ఠపూర్వై ర్మున
భిర్నదీజల ప్రపూర్ణ సౌవర్ణ ఘటీకరై రపి, అధిప్రయాతః
పటహాదినాదితం వివేశ సాకేతపురం రఘూద్వహః. ౩౧.
ప. తతశ్చతుస్సాగరవారిపూర్ణై స్సువర్ణకుంభై స్సహజాని

---

లంకకు పతిగానొనర్చి తాను ప్రవేశించుటచే నగ్నిని పవిత్రముగా నొన
రించిన సీతను పరిగ్రహించెను. ౨౮. వానరులతోకూడ శ్రీరాముడు
పుష్పకవిమానమునెక్కి సీతకు సముద్రబంధము మొదలగు విషయముల
జెప్పుచు భరద్వాజాశ్రమము చేరెను. ౨౯. అట భరద్వాజునిచే
నీయబడిన యాతిథ్యమును గ్రహించి సంతోషముతోగూడిన ప్రజలు
భరతుడు ముందునడువ వియోగము నొందిన తొలిబిడ్డగల గోవులవలె
నున్న తల్లు లెదుర్కొన, వసిష్ఠు డాదిగాగల మునులు నదీజలములు
నింపిన పూర్ణకుంభములెత్త వాద్యములు మ్రోయ శ్రీరాముడయోధ్య

మేనమ్, హిరణ్యపట్టామవబధ్య ఫాలే వసిష్ఠపూర్వా మునయోఽభ్యషించన్. ౩౨. ప. అథారుహ్య భద్రాసనం రామభద్రః కిరీటం కులాయాత మాదాయ మూర్ధ్ని, స సమ్మానయామాస సమ్మాననీయాన్మునీశాన్మహీశాన్కవీశాన్కపీశాన్. ౩౩.

ఇతి యుద్ధకాణ్డః.

---

జేరెను. ౩౦, ౩౧. అంత భార్యతోఁగూడిన రామునకు నాల్గుసముద్రములనుండి కొనిరాబడిన ఉదకములుగల పూర్ణకుంభముల నభిషేకము చేసి ఫాలభాగమున బంగారుపట్టకట్టి రాజ్యమునం దుంచిరి. ౩౨.అంత నారాఘవుడు సింహాసన మధిష్ఠించి కులక్రమాగతమైన కిరీటమును ధరించి మహర్షులను, రాజులను, కవివరులను, కపివరులను సన్మానించెను. ౩౩.

# శ్రీ రా మా య ణ సం గ్ర హః

# ఉ త్త ర కా ణ్డః

సుగ్రీవప్రముఖాన్ సఖీన్ జనపదే స్వే స్వే ప్రతిష్ఠాపయన్ పుత్రౌ ప్రాప గుణాధికౌ కుశలవా వానందపూర్ణాన్తరః, నిత్యం సాదర మాశ్రిత స్స్వతనుజై ర్లోకోత్తరై ర్భ్రాతృభి స్స్వాత్మీయానాం ముద మావహన్ సముకరో ద్రాజ్యం హి నిష్కంటకమ్. ఇత్యుత్తరకాణ్డః.

ప. ఇతి వైయాకరణేన శ్రీమద్రామానుజాభిధానేన, రచితం రామాయణసంగ్రహ మనుగృహ్ణాతు జానకీజానిః.

రామాయణసంగ్రహ స్సమాప్తః.

---

## ఉ త్త ర కాం డ ము

పట్టాభిషేకానంతరము సుగ్రీవాది మిత్త్రులను వారివారి పట్టణముల కనిపి సంతసిల్లిన మనసుకలవాడై గుణవంతులగు కుశుడు, లవుడు నను కుమారుల గాంచెను. లోకోత్తరులగు సోదరులతోడను పుత్త్రులతోడను కూడి తల్లుల కానందము కలిగించుచు రాజ్యమును నిష్కంటకముగా నొనరించెను.

శ్రీ ర స్తు

అకర్మకాదిప్రయోగాణా ముదాహరణాని

ప్రదర్శ్యంతే.

| | |
|---|---|
| శ్లో. రామో విరాజతే | అకర్మక కర్తరిప్రయోగః |
| రామోభూమండలమపాలయత్, | సకర్మక కర్తరిప్రయోగః |
| రామచంద్రో దశగ్రీవం పరలోకమనీనయత్. ౧. | ద్వికర్మక కర్తరిప్రయోగః |
| రామేణోపార్జితా కీర్తిః | కర్మణిప్రయోగః |
| రామచంద్రేణ భూయతే, | భావే ప్రయోగః |
| రామేణ కుంభకర్ణస్తు ప్రాపితస్త్రిదశాలయమ్. ౨. | ద్వికర్మక కర్మణిప్రయోగః |

---

చెన్నపుర్యామ్: 'వావిళ్ల' ముద్రణాలయే ముద్రితా—1966.